శ్రీ రామాయనమః

# వామన చరిత్రము



విరచితము

శ్రీ ఆంధ్ర వాల్మీకి

వాసుదాస స్వామి



శ్రీరామ

# ఆర్యచరిత్ర రత్నావళి

# వామనచరిత్రము

వావిలికొలను సుబ్బారాయ
విరచితము



శ్రీకోదండ రామ సేవక ధర్మసమాజము,
శ్రీరామసేవా కుటీరము - ఒంటిమిట్ట,
కడప జిల్లా.

## కృతజ్ఞత

ఆంధ్రవాల్మీకి బ్ర॥ శ్రీ॥ వావిలికొలను సుబ్బరావుగారుచేయు భాషాసేవయు - దేశసేవయు - దేవసేవయుఁ జూచి యీ గ్రంథమును ముద్రించుటకై అనంతపురము తాలూకా చక్రాయపేట బండమీఁది పల్లె వాస్తవ్యులైన రా॥ శ్రీ॥ శ్రీ॥ రుద్రవరము చిన్నస్వామిగారు ౧౫౦-౦-౦ రూ. లొసఁగి తమ వదాన్యత్వమును - ధర్మబుద్ధిని లోకోపకార పారీణతను వెల్లడించిరి. కావున వీరుమాకు వంధ్యులు. సముద్రమున వలసినంత నీరున్నను మేఘమిచ్చు నీరే కదా. జనులకుఁ బ్రాణాధారము. సజ్జనుల ధనము సజ్జనులు భుజింతురు. దుర్జనుల ధనము దుర్జనులు భుజింతురు. మామిడిపండ్లను జిలుకలు దినును. వేఁపపండ్లను గాకులు దినును. భగవంతుఁడు వీరికిని వీరిని బ్రోత్సహించిన పురుషకారపరులైన బ్ర॥ శ్రీ॥ హట్టి శివరావు గారికిని దీర్ఘాయురారోగ్యైశ్వర్యము లొసఁగును గాక.

**యం.వి. సుబ్బరావు**
ధర్మకార్యనిర్వాహక విశ్వాసి
మేనేజింగ్ ట్రస్టీ

శ్రీరామజయమందిరము
తిరువళిక్కేణి
5-1-1925.



దాతారం సర్వసంపదామ్

ఆపదా మపహర్తారం



లోకాభిరామం శ్రీరామం

భూయో భూయో నమామ్యహమ్

కం. నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యము నుచితాం
తాపార భూపదయయును
దాపసమందార నాకు దయసేయఁగదే.



శ్రీ పద్మావతీదేవి



శ్రీరామ

# ఆర్యచరిత్ర రత్నావళి

# వామన చరిత్రము

దేవదానవ యుద్ధంబున నింద్రునిచే బలియను దానవరాజు పరాజితుఁడై భృగువంశసంభవులైన శుక్రాచార్యాదుల నాశ్రయించి వారి యాశ్రమమంద వసించి వారికి సకలవిధ శుశ్రూషలు గావించివారి మెప్పు గాంచియుండె. ఇట్లు దీనుండై తమ్ము సేవించునతనిం గని భార్గవులు దయాళురై యిట్లనిరి. "బలీ! మావలన నీవేమి ప్రయోజన మభిలషించి యిట్లు పరిచర్య చేసెదవు" అనిన బల్లి యిట్లనియె. "బ్రాహ్మణోత్తములారా! మానవంతునకు మానహాని కంటెఁ బ్రాణహాని శ్రేయస్కరము. వజ్రధరుని తోడి రణంబున మరణంబుఁ గాంచక పరాజితుఁడనై మీ చరణంబులె శరణంబని నచ్చి వచ్చినవాఁడ. మీ శిష్యుని ముల్లోకంబు లేలించినను నధోలోకంబునఁ దూలించినను గీర్త్యపకీర్తులు మీయవియ" అని దైన్యంబున వచించిన నావిరించి తేజస్స మంచితులైన యా బ్రాహ్మణులు యోజించి యతనిచే విశ్వజిద్యాగంబుఁ జేయించిరి. సమస్త ప్రపంచమును జయింపఁ జేయు శక్తి గలిగించు యాగమునకు విశ్వజిద్యాగమని పేరు. ఆ యాగమునందలి హోమకుండము నుండి వెడలివచ్చి యగ్నిహోత్రుం డాకు పచ్చవన్నె గుఱ్ఱంబులను, సింహధ్వజము, పైఁడికట్ల దివ్యధనువు, నక్షయబాణతూణీర యుగళంబు, నభేద్యకవచంబుఁ దెచ్చి యతని కిచ్చెను. ప్రహ్లాదుఁడు వాడని పద్మమాలయు, శుక్రుఁడు ధవళశంఖము నిచ్చిరి. ఇట్లు యుద్ధపరికరంబులన్నియు సంపాదించికొని బలిబలియుండై దండధరుఁబోలిన యుద్ధండ దండనాథులు వీరభటులు వేలకొలఁదిగఁ గొల్వ సకల సేనలతో స్వర్గమును ముట్టడించెను.

వాని రాక విని యింద్రుఁడు తన గురువగు బృహస్పతి యొద్దకుఁ బోయి నమస్కరించి "యయ్యా మొన్న నాచేఁ జావు దప్పించుకొని పాఱిపోయిన బలి యింతలో నింత బలిష్ఠుం డెట్లయ్యె? వానిని జూచిన గుండె లావులించు చున్నవి. భయంకర తేజముచే ముల్లోకముల నొక్కసారి వాత వేసికొను

నట్లున్నాఁడు. మన విరోధులందఱు మనపైఁ బగ దీర్చుకొన వానినిగలసి వచ్చియున్నవారు ఇప్పటి స్థితిఁ జూడ యుద్ధమునకుఁ బోకుండరాదు; పోయితినా గెలుపు లేదు. మరణింపనురాదు. ఏమిగతి" యనిన దేవగురు విట్లనియె.

"ఇంద్రా! వీఁడు భార్గవులగు బ్రాహ్మణుల నాశ్రయించి వారిమంత్రప్రభావముచే నింతటి బలవంతుఁడయ్యెను. బ్రాహ్మణ రక్షితుండైన వీనిని విష్ణువు దక్క మఱి యెవ్వరు నీవు నీసములు నీ కధికులు జయింప లేరు. యుద్ధమునకుఁ బోయిన జయము మేలు. అది లభింపదేని లయము మేలు. అవి రెండును లభింపకున్న ముందే పలాయనము మేలు. కావున మీ రిప్పు డెందేని యణఁగియుండుఁడు. కాల మొక్క తీరున నుండదు. బ్రాహ్మణులచే నభ్యుదయము గాంచిన వీఁడు కొంతకాలము మీఁద బ్రాహ్మణుల తిరస్కరించి చెడును. అని హిత ముపదేశించిన నింద్రుండును సబంధుఁడు సపరివారుఁడునై స్వర్గంబు విడిచి మఱుఁగుపడి చనియె.

శూన్యంబైన నాకంబుఁ గాంచి బలి హృష్టుండై తన విజయంబు ఘోసింపఁ జేసి దాని నాక్రమించి యందలి యమూల్య పదార్థముల నెల్ల హరించి యందుఁ దన ప్రతినిధిని నిలిపి యున్నతపదవులం దెల్లఁ దనవారలను, దనకు వశులైన దిక్కుమాలిన సురల నూడిగంబులను నియమించి మరల భూలోకంబునకు వచ్చి సింహాసనాసీనుఁడై రాజ్యంబు పరిపాలించుచుండె.

అతఁడు ధర్మిష్ఠుఁడు. తనకు లోఁబడిన యన్నిజాతుల ప్రజలను సమదృష్టితోఁ జూచి వారివారి వర్ణాశ్రమ నీతిమతాచారముల చొప్పున వర్తింపఁజేయునుగాని భేదోపాయ మాశ్రయించి ప్రజలలో నొకరినొకదరికిఁ గలహములు పెట్ట తన ప్రభుత్వమును రక్షించుకొనఁ జూచు టక్కరికాఁడు. ధర్మార్జనమందతనికి దృష్టిగాని నయభయమాయో పాయములచేఁ బెక్కు నెపములఁ బ్రజల ధన మపహరించి తనాఁఉ దనవారు నైశ్వర్యవంతులు గావలయునని తలంచువాఁడు కాఁడు. భూమి గోవనియుఁ బ్రజలు దూడలనియుఁ దలంచి ప్రజలను రోఇంచును గాని లేఁగలను పరుగులఁజేసి యావుల పొదుఁగుల రక్తమును బిండువాఁడు గాఁడు. దోషుల దండించుటయందుఁ దన జాతివారని పరజాతి వారని ధనికులని దరిద్రులని భేదమెంచఁడు. ప్రజల నిమిత్తమై రాజుగాని రాజు నిమిత్తమై ప్రజలు గారను నిశ్చయజ్ఞానము గలవాఁడు. లోకులవలన నొకమార్గమునఁ గొన్నధనమును





వేఱొకమార్గమున వారికే చెందఁజేయుచుండును గాని ప్రజలు దరిద్రులు దుర్బలులు నైనఁగాని తన రాజ్యము శాశ్వతము కాదను నభిప్రాయము గలవాఁడు కాఁడు. వీని రాజ్యమున దేమియనువారు నాస్తియనువారు లేరు. వర్షము ధర్మాధీనము కావున ధర్మాత్ముఁడైన యతని రాజ్యంబున సకాలమున వర్షములు గురియుచుండెను. కఱవులు లేవు. బాల మరణములు లేవు. మాఱి లోనగు వ్యాధులు లేవు. పిన్నలకుఁ బెద్దలు పితృకార్యములు చేయరు. అన్ని జాతుల వారు స్వవృత్తుల యందుండుటచే వృత్తిహానియు వృత్తిహానియు లేవు. దేవబ్రాహ్మణ భక్తిగలవాఁడు. సత్కర్మనిష్ఠుఁడు. భార్యను జక్కఁగ రక్షించిన సౌఖ్యము సంతానము కలుగునట్లు ధర్మము రక్షించిన నర్థకామంబుల వారిగఁ గలుగునని ధర్మనిరతుఁడై యుండువాఁడు. ఇట్లు ధర్మము సత్యము తప్పక యతఁడు చాలఁగాలము రాజ్యము చేయుచుండెను. ఇతనికి దేవేంద్రపదము శాశ్వతము చేయఁగోరి బ్రాహ్మణ లితనిచే నూఱశ్వమేధములం జేయించిరి.

ఇట్లు కొంతకాలమరుగఁ దపస్సమాధి నుండి లేచి కశ్యపప్రజాపతి తన పెద్ద భార్యయైన యదితిని జూడవచ్చెను. ఇట్లు వచ్చిన దీనవదనయై శోకతప్తయై సంతోషహీనయై యున్న యా యిల్లాలిం జూచి చేరఁదీసి యొద్దఁ గూర్చుండఁ బెట్టుకొని కశ్యపుఁ డిట్లనియె.

ప్రేయసీ! నీ విట్లుండఁ గారణం బేమి? మన యింటికి నతిథు లభ్యాగతులు వచ్చుచున్నారు గదాద? వారిని నీవు భోజనమో పానీయమో యిచ్చియో లేచి యెదురుగఁ బోయి మంచి మాటలాడుట చేతనో యాదరించుచున్నదావే కదా? బ్రాహ్మణులకిప్పుడే చేటు కాలము రాలేదు గదా? ధర్మమునకు మృత్యువశులై యుండు మనుష్యులకు హాని కలుగుచుండ లేదు గదా. ఇల్లాలా! యింటియందు నశుభ మేదియుఁ గలుగలేదు గదా? ధర్మమునకు నర్థమునకుఁ గామమునకు భంగము లేదు గదా? యోగులు గాకపోయినను గృహస్థులు యోగఫలమును గృహస్థధర్మము నిర్వహించుటచేతనే పొందుదురు. ఇంటి పనులయం దాసక్తి గలదానవై యతిథుల నభ్యాగతులఁ బూజింపక పంపవు గదా? ఏ యింట నతిథులు ప్రత్యుత్థానముచేనైనఁ బూజింపఁబడక వృధా పోవుదురో యది నక్కల బొక్కగాని మనుష్యుల యిక్క గాదు. నే నింట లేనప్పు డగ్నులవేళ కర్పించుచున్నావు కదా. అగ్నియు బ్రాహ్మణులు విష్ణువునకు ముఖము. వారి నర్చించిన విష్ణుండు తృప్తుండగు.

సర్వభూతమయుఁడు విష్ణువు తృప్తుండైన సమస్తలోకంబులు తనివి చెందు. చెట్టు మొదటఁ బోసిన నీళ్లు చెట్టున కంతయు వ్యాపించును గదా. తల్లితండ్రి భర్త యాచార్యుఁడు నతిథి వీరు సాక్షాత్ భగవత్స్వరూపులు. వీరిని దిరస్కరించి యెందో దేవుఁడున్నాఁడని మ్రొక్కులిడిన యా దొంగ మ్రొక్కులుతోనే భగవంతుఁడు సంతోషించునా? వీధిలో నవమానించి మూలయింట మ్రొక్కినఁ బ్రయోజనమేమి? నీ కొడుకుంలందఱు లెస్సయున్నారు గదా? నీ కోడండ్రు నీ మాట కెదురాడి యసడ్డచేయుట లేదు కదా. నీవు వారిని నీకన్న పుత్రికల వలె నాదరించుచున్నావు కదా. ఏ యింటఁ గోడండ్రు కన్నీరు గార్తురో యాయిల్లు పురికొనదు అనిన నదితి యిట్లనియె.

భగవంతుఁడా! గార్హస్థ్య ధర్మమున కే హానియు లేకుండునట్లు సర్వముఁ దీర్చుచున్నదానను. అతిథు లభ్యాగతులు పూజితులై పోవుచున్నారు. సర్వకాల సర్వావస్థల మిమ్ము ధ్యానించుచు నే లోపము లేకుండ వర్తించుచున్నదానను. మీరు నాకు నాథులై యుండ నింట నేమిటఁ గొఱఁత గలుగు? అట్లైన నీ వేల యిట్లున్నదానవనినఁ జెప్పెద వినుఁడు. నా సవతి యగు దితియు నేను నక్కాచెల్లెండ్రము. అట్లయ్యు నదియు దాని కొడుకులు నా మీఁదను నా కొడుకుల మీఁదను ద్వేషము మానక పలువిధముల బాధించుచున్నారు. నా కొడుకు నింద్రుని వెడలఁ గొట్టి రాక్షసులిప్పుడు స్వర్గమేలుచున్నారు. తన కొడుకులు నా కొడుకులఁ గొట్టినను దిట్టినను నవమానించినను దితి యౌనౌను సరిసరియని నవ్వుచుఁ జూచుచుండను గాని వలదని యొకమాటయైనఁ బల్లెత్తి యనదు. నా కొడుకింద్రుఁడు మాఱువేషముతో నెందున్నాఁడో తెలియలేదు. ఎండకన్ను వానకన్నెఱుఁగక వైజయంతమున హంసతూలికాతల్పమున వేవు రచ్చరలు సర్వోపచారములు చేయ మగనియురముపై శయనించు నా పెద్దకోడలు తలకు నూనె మెఱుఁగు లేక చింపిఱితలతోఁ జింపి చేలతో గిజిగాని గూఁడువంటి కొప్పుతోఁ జూచువారు పిశాచియోయనఁ బంచటరుఁగులందో గులకరాలయందో చేయిదిండుగాఁ జేసికొని ఱొమ్ము నేలకొత్తి పండుకొనుచున్నది.

నా కొడుకు కోడలిట్లు దుఃఖపడుచుండ నా కెట్లు కూడు రుచించును? ఎట్లు కంటికి నిద్దురవచ్చును? కొడుకులు బాగుండినఁ గదా తల్లికి బాగు. ఇంతకంటెను సంతాపకరమైన వార్త వినుఁడు.





మానమందు దృష్టిగల నా కొడుకు లెందెందో యష్టకష్టములఁ బడుచుఆన్నరు. అద ట్లుండనిండు. దేవతాశ్రేష్ఠులుండిన యన్ని పదవులందును నేఁడు రాక్షసులున్నవారు. ఉన్ననేమి? బలి ధర్మాత్ముఁడు గదా యందురేమో బలి ధర్మాత్ముఁడు. సత్యవాది జితేంద్రియుఁడు నైన నతని వారందఱు నట్టివారా? కారుగదా. ఉన్నత పదవులం దన్నిటఁ దనవారు. బానిస పనులయందు నా వారు. వానివారు నా కొడుకులఁ బెట్టెడు నిక్కట్లు పలికెడు దురుక్తులు నన్ని యిన్ని గావు. యాగంబులందు హవిర్భాగముల నెల్ల బలియే హరించుచున్నాఁడు గాని యొక పిడుచయైన నింద్రాదుల కీయఁడు. కావున నతఁడిచ్చు నెలబత్తెములతో నా వారు జీవింపవలసి యున్నది. అదియును గడుపునిండ నీయఁడు. కొలువు కాఁడు. బ్రదుకు నంత మాత్రమే బత్తెమిచ్చును. వాని పెండ్లాము బిడ్డ లేగతిఁ బట్టవలయునో. ఒక కార్యమును దనవారు చేసిన నూర్లకొలఁది జీతములు. దానినే నావారు జేసినఁ బదుల కొలఁదియు వేతనముండదు. తనవాఁడు నాకొడుకును జంపిన బ్రమాదము. క్షంతవ్యుఁడు. నా కొడుకుఁ దనవారిలో దేబను గఠినముగ మాట్లాడినను జాతివైషమ్యము కారణము గావున హంతవ్యుఁ డందురు. నా కొడుకులు చేసిన గొప్పకార్యములు గాని వారు బ్రతికిన బ్రతుకును గాని యెవ్వరు స్మరింపరాదు. ఇంద్రుఁడు జారుఁడు బ్రాహ్మణహంత యజ్ఞ విఘ్నకర్త తపోహానికరుఁడు గురుద్రోహి బాలకమారకుఁడు వేశ్యాలోలుఁడు అసహిష్ణువు దేవతలు సురాపానము చేయువారు గావున సురలైరి. వారు వేశ్యాలోలురు. వావి వరుసలు లేని వారు. వారికి భార్యలయందు సంతానము గలిగించు శక్తి లేదు. వారు క్రోఁతులతోను, గొండ్రముచ్చులతోను, నెలుఁగులతోను, సంభోగింతురు. అని యిట్టివి లక్ష్యముల తోఁడ గథలు చరిత్రములు వ్రాసి నా కొడుకుల బిడ్డలచేతనే చదివింతురు. ఎంతసేపైనఁ దను యుత్కర్షము దేవతల యపకర్షము ఘోషించుచుందురు. తాము పూర్వదేవతలు గావున దేవతలకు ముందు తామే పుట్టిరఁట. ఆ కారణముచే భూమియంతయుఁ దమదఁట. దేవత లన్యాయముగఁ దమ భూమి నాక్రమించిరఁట. ఇట్టి కథలన్ని మన కుఱ్ఱకుంకలు నమ్మి తమ పూర్వులు దేబలని రాక్షసులే సత్యవాదులు, మహాబల సంపన్నులు, కార్యసమర్థులు, పరోపకార పారీణులు నని తమ్ము దూషించుచుఁ బరుల భూషించుచున్నవారు. ఇంతకంటె నీచమై శోచనీయమై దశ యుండునా?

వారి యెంగిలి మెతుకులకై యాశించి మనవారు వారిలోఁ జేరుకొని వారికి సహాయము చేయుచున్నవారు. బలికిఁ బరికరములన్నియు నిచ్చినది యగ్నికాఁడా? దేవతల హవ్యమును రాక్షసులకు మోచికొని పోవుచున్నవాఁ డగ్నికాఁడా? పిల్లదేవతలు తమ వేషములను మాని రాక్షస వేషములు వేసికొని గొప్పవారమైతిమని గర్వించి వారు తినెడు నవి తాము తినుచు వారు త్రాగునవి తాము త్రాగుచు ఘనకార్యము సాధించినట్టు నిక్కుచు నీల్గుచు విఱ్ఱవీఁగుచు దిరుగుచున్నవారు. ఇట్టి నా బిడ్డలను జూచి నేనే గుర్తింపఁ జాలకున్న దానను. పరధర్మమున నభివృద్ధి గాంచుట కంటె స్వధర్మమునఁ జచ్చుటే మేలనియుఁ బరు లెప్పటికైనఁ బరులేయనియు వీరికి జ్ఞానములేదు. వారి మోఁచేతి క్రింది గంజి త్రాగు మనవారే తక్కిన మనవారిని బాధించుచున్నారు. దీనికెంతని యేడుతును? నా కొడుకులయాయుధములన్నియుఁ బరులు బలాత్కారముగ లాగుకొని మంగలికత్తి చూరుకత్తి కొడవలి యిట్టివి తప్ప మఱి యే యాయుధమును దేవతలు పట్టరాదని శాసించిరి. ఇండ్లలో నైనను దమ చేష్టల గుఱించి చెప్పుకొనిన నేరమఁట. వీధులలో నలువురు దేవతలు గూడిన దోషమఁట. అయ్యో! పరాధీనత్వ మెంతటి నరకము. దీని నుండి ముక్తులగుటకు స్వాభిమానము స్వకీయాభిమానముగల విబుధు లేవేవియో యుక్తులు చేయుచున్నారు. గాని దైత్యులు వీరల మఱింత బాధించుచున్నారు. అనుకూలురకు లంచములిచ్చి సాధించుచుఁ బ్రతికూలుర బాధించుచుఁ దటస్థులకు మీ కిదియే హితము మీవారు ప్రభువులైన మీకు క్షేమము లేదు. ఇంద్రుఁడు ప్రభువాయెనా మీకుఁ బెండ్లాలు దక్కరు. అగ్ని ప్రభువాయెనా యందఱ నొక్కసారి కాల్చివేయును. దండధరుఁడు ప్రభువాయెనా మిమ్ముల మృత్యువశులఁ జేసి రౌరవాది నరకములఁ ద్రోయును. రాక్షసుని మాట చెప్పనేల? మిమ్ములఁ బీఁకి తినును. వరుణుఁడు ప్రభువాయెనా జలప్రలయము. గాలి ప్రభువాయెనా యందఱ నొకసారి యెగఁజిమ్మును. ఒకనికిఁ జూపు తక్కువ ఒకనికిఁ పౌరుషము తక్కువ పండుఁడు. ఇట్టివారి ప్రభుత్వములో మీ కేమి సుఖమని బోధించుచున్నారు. నాథ్యా యెంతని చెప్పుదును.

మీకుఁ గశ్యపనామము సార్థకము గదా. పశ్యకశబ్దమే కదా కశ్యపశబ్దమయ్యెను. కావున మీరు సర్వజ్ఞులరు. సర్వసాక్షులరు. మీకు





నేనేమి చెప్పఁగలదానను. నీకు వారు సవతికొడుకులైనను నాకు సొంతకొడుకులే కదా. వారిమేలు నే నెట్లు సహింపకుందు నందురేమో వాస్తవమే. దేవానాం దానవానాంచ సామాన్య మధిదైవతమ్మన్నట్లు దేవదానవులకు నారాయణుఁ డెట్లు సమానదైవమో యట్లే మీరు సమానజనకులే. అయినను భగవంతుఁడు భక్తవత్సలుఁడైనట్లు మీరును గావలదా? భగవంతుని ప్రకృతి దైవమని యాసురమని ద్వివిధము. ఆత్మవిద్యాసక్తులు దైవసంపత్తి గలవారు. అనాత్మవిద్యా ధురీణు లాసుర ప్రకృతులు. దైవసంపత్తిగలవారూర్ధ్వలోకంబుల సుఖింపవలయు. అసుర సంపత్తిగలవా రధోలోకముల పాలుపడవలయు. ఇది భగవన్నియమము గదా.

ఇది యెఱిఁగియే దైవమైన నాకు నదితియనియు నా సవతికి దితియనియు మా జనకుఁడు మా యిరువురకునామంబు లిడియె. నా కొడుకులు దేవతలైరి. నా చెల్లెలికొడుకులు దైత్యులైరి. కావున సద్గుణ సంపత్తిగల నా పుత్రకుల మీరు చేపట్టకున్న నిఁక దిక్కెవ్వరు? మరల నా కొడుకునకు స్వారాజ్యంబు స్వరాజ్యంబగున ట్లనుగ్రహింపుఁడనినఁ గశ్యపుఁడు నవ్వుచు నిట్లనియె.

ప్రజ్ఞావతీ! విజ్ఞాన యుక్తవయ్యు నజ్ఞానులవలె దుఃఖించెద వేల? జనకుఁ డెవ్వఁడు? జనని యెవ్వతె? వానికదియేల యిల్లాలయ్యె? బిడ్డలెవ్వరు? వారి కడుపుననే వారుపుట్టనేల? ఈ వావివరుసలు దేహ గతంబులా యాత్మగతంబులా? ప్రతిజీవియు నెనుబదినాలుగులక్షల యోనులందుఁ గోట్ల కొలఁది జన్మము లెత్తుట యెఱుఁగవా? ఇన్ని జన్మంబులందును దండ్రు లెందఱో తల్లు లెందఱో బిడ్డ లెందఱయిరో యాలోచింపుము. సంసార ప్రవాహమునఁ గొట్టుకొనిపోవు జీవికి ఋణబద్ధులైన చుట్టాల కేమి కొఱఁత? నీ కొడుకులు కాకముందు వీ రెందుండిరో మరణానంతర మెచ్చటికిఁ బోయెదరో, నీ యుదరంబున నేల పుట్టిరో యెన్నాళ్లిట్లుందురో, పుటుట్వనఁగా నేమో మరణమున నేమో దేహము లెంతకాలముండునో సుఖదుఃఖ కారణములేవో, యీ సంసార స్వరూప మెట్టిదో, యది యెందుఁ బుట్టెనో, యెట్లు పెరుఁగుచున్న దో దీని కంత్యమెట్లో యాలోచింపవలదా? ముగుదా! యిదంతయు విష్ణు మాయా విలాసము గాని యితరము గాదు. సూత్రధారుఁడు తోలుబొమ్మల నాడించునట్లు జగన్నాటకసూత్రధారి తన విలాసార్థము స్వసంకల్ప కల్పితములై ప్రాణవాయు పూరితములై జీవాధిష్ఠితములైన యీ తోలుబొమ్మలఁ దన యిచ్చ

కొలఁది నాడించుచుండును. వాయు ప్రేరితములై పరస్పరము ఢీకొను సముద్రపు టలలకువలె జీవునకుఁ బరతంత్ర కర్త ృత్వమే కాని స్వతంత్ర కర్త ృత్వము లేదు. వాస్తవముగ నీ కొడుకుల బాధించిన వారు రాక్షసులు గారు. భగవంతుఁడే. ఏలందువా?

శా. సంపన్నుం డొరుఁగాన లేఁడు తనువున్ సంసార
మున్ నమ్మిహిం । సింపం జూచు, దరిద్రుఁ డెత్తు
వడి శుష్కీభూతుఁడై చిక్కి హిం। సింపం దన్యు
ల, నాత్మకున్ సములుగాఁ జితించు నట్లౌటఁద ।
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య
మూహింపఁగన్.

పేదవడినవారు దమము–దయ–దానము లోనగు సద్గుణములు గలవారై తమ నొప్పివంటిదే యితరుల నొప్పియని యెఱిఁగి యితరుల బాధింపక భగవద్భక్తిగల వారై యుందురు. సద్గుణసంపత్తికి భక్తికి భగవంతుఁడు సంతోషించి వారి నీ జన్మంబు ననో మఱుజన్మంబుననో యైశ్వర్యవంతులఁ జేయును. అంతటవా రైశ్వర్యబలగర్వితులై క్రిందు మీఁదు తెలియక యైశ్వర్యమే శాశ్వతమని యెంచి దయా దాన ధర్మశూన్యులై దుర్బలుల బాధించి వేధించి సాధించి పీడింతురు. ఇట్లార్జించిన పాపము వీరిని మరల దరిద్రులఁ జేయును. ఇది సర్వ సామాన్యము. కలిమి లేములు కావడి కుండలు. నీ కొడుకుల స్థితియు నిట్టిదే. నీ కొడు కింద్రుఁడు గర్వంబుచేఁ గదా గురువును బరిభవించెను. బ్రాహ్మణుల నవమానించెను. విప్రుల వధించెను. పరస్త్రీలఁ గామించెను. యజ్ఞములకు విఘ్నములు కావించెను. తపస్సులు చెఱిచెను. ఇట్టి పాపము లూరక పోవునా? సంపన్నాంధులకు దారిద్ర్యము నేత్రాంజనము. కావున వారికి బుద్ధి వచ్చుటకై భగవంతుఁడు నీ కొడుకుల దరిద్రులగను బరాధీనపు బ్రతుకు బ్రతుకు దాసులుగను జేసెను. నీ కొడుకులు గొందఱు స్వాతంత్ర్యము స్వరాజ్యము సంపాదింపఁ బ్రయత్నము చేయుచున్నారంటివి. వెఱ్ఱీ! దైవము తోడ్పాటు లేక పురుష ప్రయత్నము చేతనే మహాకార్యము లగునా? దేవసేవచేఁ గాక దైవము తోడ్పా టెట్లుగలుగును? ఎంతటి దుర్బలులకైనను భగవత్సేవ సర్వార్థసాధకము. దాని నుపేక్షించు వఱకు నీ కొడుకులు కృతకృత్యులు కాఁజాలరు. నీ కొడుకులు నానావిధముల భ్రష్టులై యుండుట సత్యము.





వారికిఁ గాముఁడే దేవుఁడు. ఉదరపోషణమే పరమార్థము. ఇట్టివారు దేనికిని గొఱగారు. కావున వివేకులయిన నీ కొడుకులకుఁ గొందఱకైన భగవత్సేవ చేయ బోధించి నీవును భగవంతుని నారాధన ధ్యానాదుల నర్చింపుము. భగవంతుఁడును, వాసు దేవుఁడును, జనార్దనుఁడును, గృపాలుండును దీనానుకంపియు, సర్వభూత హృదయ సదనుండునగు హరిని సేవించిన నీ యిష్టార్థము లెల్ల ఫలించును"

అనిన నమ్ముత్తకాశిని సంతోషంబునఁ జిత్తమిగురొత్త నిజచిత్త వల్లభుతో నిట్లనియె. శ్రీమన్నారాయణు నెట్టు లర్చింప వలయు? ఎట్లు సేవించిన నా యెడ నమ్మహానుభావుఁడు ప్రసన్నుండగు ననినఁ గశ్యపుఁ డిట్లనియె.

పుత్రార్థినైన నాకుఁ బరమేష్ఠి పయోవ్రతంబను కేశవప్రీతికరంబైన వ్రతం బుపదేశించె. దాని విధానంబు వినుము. మాఖ బహుళంబున నమావాస్య దినంబున లభ్యమగునేని నడవియందు వనవరాహంబు ద్రవ్విన మట్టిని ఉద్ధృతాసివరాహేణ మంత్రంబుచే సేకరించి తెచ్చి దానిచే నింట నేలయలికి రంగవల్లి దీర్పుము. పవిత్రమైన యా ప్రదేశంబున భగవద్విగ్రహంబు స్థాపింపుము. స్థండిలమందును, సూర్యునందును, బూర్ణజల కుంభమునందును, నగ్నియందును, నీ యేనింట భగవంతు నావాహనాది షోడశోపచారంబుల నర్చింపుము. ఆవుపాల హోమంబుఁ గావింపుము. పాయసంబు నైవేద్యంబిడుము. హోమతర్పణాదుల యథావిధి గావించి యిష్టబంధువులకు నిరువురకైన బ్రాహ్మణులకు మృష్టాన్నభోజనం బిడుము. నీవు నివేదిత శేషంబు క్షీరంబు మాత్రము గ్రోలుము. ఆవాహనాది కీ యలన్నియు ద్వాదశాక్షర మంత్రంబు చేతనే కావింపుము. నేలఁ బరుండుము. ముమ్మాఱు జలకమాడుము. భోగమున సజ్జన సంభాషణమును మానుము. హింసకారాదు. నే నుపదేశించు మంత్రంబుల ధ్యానింపుము. ఇట్లష్టోత్తర శతంబు జపించుచుఁ బండ్రెండు దినములు పురుష సూక్తంబున నర్చించి పదుమూఁడవ నాఁడు ద్వాసనంబుగావింపుము. గురువుల నర్చింపుము. అశ్వపాకము సమస్తజనుల కన్నమిడుము. ప్రతిదినము నృత్యవాద్య గీతస్తుతుల భజనము గావింపుము. ఆ రాత్రి నీకు భగవంతుండు ప్రసన్నుఁడై నీకోరిన వరమిచ్చును. భక్తికంటె శ్రేష్ఠమైనది లేదు. భక్తి కసాధ్యమైనదియు లేదు. భక్తికి వశుఁ డైనట్టు భగవంతుఁడు మఱి దేనికిని వశుఁడు గాఁడు. భగవంతుఁడు భక్త్యైక సాధ్యుఁడు.

ఈ పయోవ్రతము సర్వయజ్ఞ వ్రత తుల్యము. సర్వతపస్సారము. కావున భక్తి తప్పక సదాచారయుతవై యశుచివిగాక యీ వ్రతం బనుష్ఠింపుము. శుభమగునని యుపదేశించి తపోవనంబునకుఁ గశ్యపుఁ డరిగె.

ఆ శీలవతియు నియతయై వ్రతము సలిపి త్రయోదశినాఁడు దుద్వాసనము గావించి యేకాంతంబున నేకాగ్రచిత్తయై శ్రీకాంతు భగవంతు శ్రీమన్నారాయణు ధ్యానించు చున్న సమయంబున నిరాకారుండయ్యు భక్తాభీష్టకరుండు కావునఁ జతుర్బాహుండును, శంఖచక్రగదాది సాధనుండును, బీతాంబరుండును, నైయా పతివ్రతా లోచన గోచరుండుగాఁగా నా సాధ్వియు నేల వ్రాలి సాష్టాంగ గదండ ప్రణామంబులు గావించి లేచి కన్నుదమ్ముల నానందజలమ్ములు స్రవింప, మేనఁబులక లెగయఁ గాంచి కాంచి యాపోవక యాయననే నేత్రపుటంబులఁ ద్రావుచుఁ బలుక నేరక మిన్నకుండి కొంత వడికి యప్పుడంతి గద్గతకంఠంబున నిట్లు విన్నవించె.

యజ్ఞేశ్వరా! యజ్ఞపురుషా! యచ్యుత! తీర్థపాద! దీర్ఘశ్రవ! శ్రవణ మంగళ నామధేయ! ఆపన్న జనవృజినోపశమనా! దీననాథా! భువన సృష్టిస్థితి సంహారములకై యిచ్చకొలఁది రూపంబుల ధరించుచుందువు. ఆయువు–సంపత్తు– సౌందర్యము – భూమ్యాకాశజలాదులు యోగమహిమలు తపోబలములు జ్ఞానములోనైన సర్వము సంతుష్టుఁడవైన నీవలననే జనులు పొందుచుందురన మాబోంట్లకు శత్రుజయము దుర్లభమగునా? నా యట్టి దీనురాలికి నీవు యథాస్వరూపంబుగ గోరించుటయే నీ సౌశీల్యంబును, బరమకారుణికత్వంబును, భక్తజనరక్షాపరత్వంబును జాటుచున్నది.

అనినఁ జక్రపాణి మధురవాణి నమ్మధురవాణి కిట్లనియె. "దేవమాతా! నీ తలంపు నే నెఱుంగుదు. హతశ్రీకులైన నీ పుత్రకులకై నీవు తపించుటయు వారికి మరల స్వరాజ్యంబు లభింపఁజేయు నాశయంబు గలదానవగుటయు నే నెఱుంగుదు. పయోవ్రతంబున నన్నర్చించిన నీ భక్తికి మెచ్చితి. మదారాధనం బెన్నఁటికి వ్యర్థము గాదు. ఫలము శ్రద్ధానురూపమై యుండు. అనుకూలేశ్వర బ్రాహ్మణ సాహాయ్యంబునఁ జేసి బలవంతులై యుండు రాఓసుల నిప్పుడు పరాక్రమంబున జయింపరాదు. కావున స్వాంశమున నీ సుతుఁడనై జనించి యుపాయంబున నీ యభీష్టంబుఁ దీర్చెద. శోకింపకుమని యంతర్హితుండైన నా యదితియు ముదితయై భర్త సేవ చేయుచుండె.





కశ్యపుఁడును దనయందు నొందిన భగవదంశమైన తేజమును దితియందుఁ బ్రవేశపెట్టెను. చీర చిక్కుట యాదిగా నెలలతోడ గర్భస్థ శిశువు వృద్ధినొంది భాద్రపద శుక్ల ద్వాదశి నభిజన్నక్షత్రంబున శ్రవణంబునఁ జంద్రుఁడుండ భగవంతుఁడు నారాయణుండు లోక శ్రీకరుండును, శంఖచక్రాదిసాధనకరుండును, ధృతకిరీట మకుటచూడావతంసక గ్రైవేయహార కేయూర కటక కాంచీనూపురుండును, హాటకాంబరుండును, శ్రీవత్సధరుండును, దీనజనరక్షాపరుండును, దుష్టశ్రీహరుండును నిఖిలజన మనోహరుండునై యావిర్భవించె. ఆ సమయంబున నచ్చర లాడిరి. గంధర్వులు పాడిరి. బ్రహ్మాదులు కొనియాడిరి. దేవతలు సంతోషంబునఁ దేలాడిరి. ఎట్టి రూపంబమున నదితి కానాఁడు గోచరించె నట్టి రూపంబున జనించి యామె నానందవార్ధిముంచి యోగములు నాశ్రయించి పామర బాలకురీతిఁ జేష్టలు గావించె. ఇట్లుజనించి క్రమక్రమ ప్రవర్ధమానుండైన వామనునకుఁ గశ్యపుఁడు సకాలంబున వేదోక్తవిధి నుపనయనంబు జరిపించె. అప్పుడు సవిత సావిత్రి నుపదేశించె. బృహస్పతి జన్నిదంబును, గశ్యపుఁడు మౌంజియు, నదితి కౌపీనంబును, ధరణి కృష్ణాజినంబును, చంద్రుఁడు దండంబును, దివి ఛత్రంబును, సరస్వతి యక్షమాలయు, బ్రహ్మ కమండులువు, సప్తర్షులు కుశలను, కుబేరుఁడు భిక్షాపాత్రము నొసంగిరి. భవాని భిక్షయిడియె. ఆవల నొక్కఆఁడా బ్రాహ్మణ వటుఁడు గృహాగతులైన యతిథుల నభ్యాగతులం గని యయ్యలారా! లోకంబున దాతలు గలరా? దేహియనిన నాస్తియనక యిత్తురా? వా రిట్లనిరి. "లోకంబున నర్థుల యాశవ్యర్థంబు సేయనివారు గలరు గాని వారిలో బలిచక్రవర్తి దానవీరుఁడు. ఆయన యక్షరశిక్షయందు నకారము పలికినవాఁడు కాఁడు. గుణితంబున లాకేత్వము దాకుఁ గొమ్మునిచ్చి యెఱుంగఁడు. ఆయన రాష్ట్రమున దరిద్రుఁడే దరిద్రుఁడు. వైరులకు వెన్ను, పరస్త్రీలకు ఔమ్ము నిచ్చినవాఁడు కాఁడు. ఆయనను యాచించిన నీకు వలసినంత సంపద లభించును" అని బోధించిరి.

ఆ సమయమున బలిచక్రవర్తి యశ్వమేధ యాగము సేయుచుండెను. ఇదియే సమయమని వామనుఁడును బలియజ్ఞవాటంబునకుఁ బోవ నిశ్చయించుకొనెను. ఆహా! శ్రీమహాలక్ష్మి యిల్లాలై సర్వదా తన యురమందు వసించు లోకప్రభుండు మహాత్ముల కంటె మహాత్ముఁడైన మహానుభావుఁ డొక

రాక్షసమాత్రుని యాచింప బయలు దేఱెను. సత్యము సత్యము. పరక్షేమార్థము నీచులనైన యాచించుట మహాత్ముల కలంకారము కదా. ఇట్లు బయలుదేఱి యా బ్రహ్మచారి నిమజ్జజ్జన శర్మద యగు నర్మదను దాఁటి యుత్తరతీరముం జేరి జన్నవాడఁ బ్రవేశించెను. ఆ మాయార్భకుని దుర్భర తేజంబున సంకుచిత తేజులైన ఋత్విజు లితఁడు ఖగేంద్రుఁడో చంద్రుఁడో సనత్కుమారుఁడో యని యబ్బురపోయి యెవ్వ రీ బాలుఁ డెందులవాఁ డెవ్వరివాఁ డేల వచ్చెనని గుసగుసలు పోవుచుండిరి.

దండము - జలకమండలువు - యజ్ఞోపవీతము - మౌంజి - కృష్ణాజినము - కౌపీనము - ఛత్రము - జడలు ధరించి వచ్చు నమ్మాయా బాలకుని విలోకించి ఋత్విజు లందఱ ప్రయత్నంబుగఁ దటాలున లేచి యెదురేగిరి. యజమానుండునుఁ గరఁగి పోసిన సౌందర్యమో యన ముద్దులు మూటఁగట్టు నా యొప్పుల కుప్పను, గుణాల తిప్పను, ఱెప్ప వెట్టక నిరీక్షించి ప్రముదితుండై సింహాసనంబు దిగివచ్చి తన భార్య జలంబులు వోయ వటుని పాదంబులఁ బ్రక్షాళించి యే పాదజలము చంద్రమౌళి యగు శంకరుఁడు పరమభక్తి శిరంబున ధరించె నట్టి యా పాదతీర్థంబును గలికల్మషాపహంబును సుమంగళంబును నగు దాని ధర్మవిదుండై శిరంబునఁ జల్లుకొని మెల్లని మాటల నా పిల్లవటువున కిట్లనియె. బ్రాహ్మణా! నీకు స్వాగతము. నమస్కారము. మూర్తీభవించిన బ్రహ్మతేజంబున నున్నవాఁడవు. బాలకా! నీవెవ్వఁడవు? ఎవ్వరివాఁడవు? నీ వాసస్థానం బెద్ది? నీ పేరేమి? ఇచ్చటికి రాఁ గారణం బేమి? నీవు వచ్చుటఁ జేసి నా జన్మంబు సఫలమయ్యెను. నా వంశంబు పవిత్రమయ్యెను. నా పితరులు తనిసిరి. నీ వేమి కోరి యిందు వచ్చితివి? నావలనఁ గాఁగల ప్రయోజనం బెద్ది? హరులా కరులా చేలలా బాలలా తేరులా నారులా యాలా చేలా సరులా పిరులా ధనములా వనములా యివి యన నేల నీ వేమి కోరిన నిచ్చెదను. నీ వాంఛితంబు నెఱిఁగింపు మనిన నవ్వటుం డిట్లనియె.

నాకు నిల్లువాకిలి లేవు. నిలువ నొక చోటని నిలుకడ లేదు. ఎందైన నుందును. స్వదేశము భువనత్రయము. ప్రేమించి చేరఁ బిలిచిన వారెల్ల నా వారే వారే నా కయినవారు. వారి వారికిఁ దోఁచిన పేర్ల వారు వారు నన్నుఁ బిలుచుచుందురు. ఏ పేరని చెప్పుదును? ఎన్ని పేర్లని చెప్పుదును. ఒకరికి





నే నాఁదకొందును. గాని నా కాఁదుకొనువారు లేదు. ఒంటివాఁడను. చుట్టపక్కములు లేరు. ఎవరైనఁ బ్రీతితోఁ బిలిచి యింత కాయో పండో పూలో నీళ్లో యాకో యలమో యచ్చిన భుజింతును. లేకున్న నూరకుందును. పెట్టుమని యెవరిని బీడింపను. ఇప్పుడు నా సిరి నా జన్నిదమందే యున్నది. సజ్జనులతోఁ గలసి మెలసి యుందును. దుర్జనులకు దూరమందుందును రాజేంద్రా! నే నెన్నఁడు యాచించి యెఱుఁగను. ఇప్పుడు మహారాజా! నీ వాక్యంబు ధర్మయుక్తంబు. యశస్కరంబు కులోచితంబు. సూనృతంబు భార్గవ శిష్యుఁడవైన నీకు సముచితంబు. ఇంద్రాదుల స్వర్గభ్రష్టులఁ జేసిన బలపరాక్రమ సంపన్నుఁడవు. ధర్మాత్ముఁడవని మహాదాతవని శాశ్వతకీర్తి గడించినవాఁడవు. నీ ఋత్విజులు బ్రహ్మతేజః పూర్ణులు. అపరబ్రహ్మలు. నీవు ప్రసిద్ధ సత్కులీనుఁడవు. నీ పూర్వులు ధైర్య స్థైర్య శౌర్యంబుల సడినన్నవారు. నీ తాత నిమిత్తమై నారాయణుఁడే యవతరించె. నీవు వంతటివాఁడవు. నీ ముత్తాత హిరణ్యకశిపుఁడు ముల్లోకంబుల జయించి తన తమ్మునిఁ జంపిన వెన్నునిపైఁ బగదీర్చుకొన లోకంబులన్నిటిని వెదకి యాయన నెందును గానక శత్రువు మరణించెనని మరల నిల్లుసేరె. విష్ణుఁడును నాయనతోఁ బోరాడలేక సూక్ష్మశరీరంబున శ్వాసవాయువువెంట నాయనలో ననడాఁగి యుండె. నీ తండ్రి విష్ణుభక్తుండు విరోచనుండు బ్రాహ్మణవేషధారులై దేవతలు వేఁడ నక్కపటం బెఱింగియు వారికిఁ దన యాయువొసంగె. రణభీరువులు మరణభీరువులు వితరణ భీరువులు మీ వంశంబున లేరు. ఇట్టి విష్ణు భక్తుల ధర్మాత్ముల వంశంబునఁ బుట్టిన నీవు నా కోరిక దీర్తువనుట వింత గాదు. కారణాంతరమున నిన్ను యాచింపవచ్చితి. లేదనక - కాదనక - యిప్పుడు పొమ్మనక - మరల రమ్మనక యడిగిన వెంటనే యర్థుల కోర్కు లీడేర్చు మహాదాతవని విని నా యల్పపుఁ గోరిక తెలుప సాహిసించెద. దైత్యేంద్రా! నా మూఁడడుగుల భూమి నాకు దానమిమ్ము. చాలును. అంతకు విశేషించి జగదీశ్వరుండ నైన నిన్నేమియు యాచింపను. వలసినంత మాత్రము యాచించుట పాపావహము గాదు. అంత కెక్కువ యాచించువాఁడు పాపి.

అనిన బలి యిట్లనియె. ఓయీ బ్రాహ్మణబాలకా! నీ వాక్యంబులు వృద్ధసమ్మతంబులు. అయినను నీవు బాలుఁడవు. గావున బాలిశుఁడవై నీ మేలెఱుఁగ లేక యున్నవాఁడవు. లోకైకేశ్వరుఁడవని నన్ను స్తుతించియు

మూఁడడుగుల నేల యడుగుచున్న వాఁడవు. నీ మతిమాంద్యమున కేమందును. డింభకా! నన్నొకపరి యాచించినవాఁడు మరల నెవ్వరిని యాచింపరాదు. కాఁబట్టి నీ జీవనమునకుఁ జాలునంత భూమి యడుగుము అనినఁ గపట వటుఁ డిట్లనియె. దానశీలా! తనకుఁ గావలసినదానితో సంతుష్టిపడని యజితేంద్రియుని కామమును ముల్లోకములైనను బూరింపనేరవు. పృథుచక్రవర్తియు గయుఁడును సప్తద్వీపముల కధిపతులయ్యు నర్థాశాపాశముల కడపలఁ గానరైరని వినుచున్నారము గదా. యాదృచ్ఛికముగ లభించినదానితో సంతోషింపని యజితాత్ముఁడు మూఁడు లోకములు లభించినను సుఖింపఁజాలఁడు. అంతియకాదు. అర్థకామంబులఁ దుష్టి లేని వాఁడు. సంసారచక్రంబునఁ దగులుకొని దుఃఖభోజియగును. యదృచ్ఛాలాభసంతుష్టుఁడు ముక్తుఁడగును. యదృచ్ఛాలాభ తుష్టుఁడైన బ్రాహ్మణు తేజస్సు క్రమక్రమముగ వృద్ధియగును. అసంతోషమనునది నీళ్లు నిప్పునువలె వాని తేజస్సును నశింపఁ జేయును. కావున వదాన్యశేఖరా! నే నడిగిన నా మూఁడడుగులు లేదనక యిచ్చితివేని ముల్లోకము లిచ్చినట్లు సంతుష్టుఁడ నయ్యెద. సత్యభాషణా! యల్పమనక నాకుఁ గావలసి యాచించిన దిచ్చిన నేను గృతార్థుఁడనగుదును. అనిన బలియు నవ్వుచు ఖర్వా! నీ యడిగిన మూఁడడుగుల యుర్వి నిచ్చితిని. కైకొమ్మని ధారాపూర్వకముగా దానము సేయ జలపాత్రము నందికొనెను.

ఇంతలో శుక్రాచార్యుఁడు బలి బలీ నిలు నిలు దాన మీకుమని చేరవచ్చి యిట్లనియె. వైరోచనీ! యితఁడు బ్రాహ్మణకుమారుఁడు కాఁడు. దేవకార్యము సాధింపఁ గశ్యపునకు నదితియందు జన్మించిన సాక్షాచ్ఛ్రీ మహావిష్ణువు. మాతో నాలోచింపక తటాలున నీయన యడిగిన దిచ్చితినంటివి. దాన దైత్యులకు మహోపద్రవంబు సంఘటిల్లె. మాయామాణవకుఁడైన యీ నారాయణుఁడు నిన్ను వంచించి యాచించి నీ యైశ్వర్యము తేజస్సు యశస్సుఁ గొని వాసవున కర్పించును. మూఁడడుగుల లోకముల నన్నిటిని విశ్వరూపుఁడై యాక్రమించును. మూఢుఁడా! తరువాత నీ స్థితియేమి గతియేమి? ఒక యడుగునఁ బుడమి నొక యడుగున దినము దేహముచే నంతరిక్షము నాక్రమించును. మూఁడవ యడుగు గతియేమి? కావున నీ వసత్యమాడినవాఁడవై నరకము పాలగుదువు. వృత్తి విపత్తి కలిగించు దానంబును దానంబుగ బుద్ధిమంతులు ప్రశంసింపరు.





వృత్తికలవాఁడే కదా దానము యజ్ఞము తపము నిష్టాపూర్త కర్మములు లోనగు ధర్మములఁ జేయఁజాలును. జీవిక లేనివాఁడేమి ధర్మము చేయఁజాలును.

ఆర్జితవిత్తమును ధర్మమునకుఁ గీర్తికి, నర్థమునకుఁ గామమునకుఁ స్వజనులకు నైదువిధముల విభజించి పురుషుఁ డుభయలోక సుఖంబు లొందును. దాన విషయమున నొకఁ డాడెడు నుడువులం దసత్యమేది సత్యమేది యను విషయమున శ్రుతివాక్యంబులు వినుము. అంగీకరించిన దిచ్చుట సత్యము. లేదనుట యసత్యము. దేహమను వృక్షమునకు సత్యమనునది ఫలపుష్పములు. వృక్షము బాగుండిన ఫలపుష్పములు బాగుండును. వృక్షము చెడినఁ బుష్పఫలములును నశించును. ఈ వృక్షమునకు నన్నృతమను నది వేరు. వేరు పెల్లగించినఁ జెట్టు నశించి పడిపోవును గదా. లేశమైన నన్నృతసాంగత్యము లేకున్న దేహము నిలువదు. సత్యము నిలువదు. సర్వథా సత్యసంధత్వమున దేహనిర్వహణము దుర్ఘటము. కావుననే కదా "దయే త్వే తేవ" సంకటములయందు దేహము నన్నృతముచే రక్షింపుమని శ్రుతి నియమించుచున్నది. ఇచ్చెదనని యంగీకరించిన దిచ్చుటచే దాతకుఁ గల సర్వస్వము పోవునేని దాతకు విపత్తి హేతువైన యద్దానము దానము గాదు. తశ్రీన్నుమాలిన ధర్మము తాఁజెడ్డ బేరము గలదా? తన జీవికకు నలసినది యుంచుకొనియే శేషమియ్యవలయును. రాజా! యడిగినవారికి లేదు లేదనుచే ధనము వ్యయము గాకుండును గావున నమృతము వలె నన్నృతము సర్వదా సేవ్యమా యందు వేని యట్లు గాదు. కలదంతయుఁ దనకు లేకుండ నీయవలదింటిని గాని కలిగియు లేదులేదని యన్నృతమాడు చుండుమనుట నా మతము గాదు. అట్లు వచించు దుష్కీర్తి జీవచ్ఛము.

అంతియకాదు. ఎట్టి సంకటసమయంబుల నన్నృతము దోషావహము కాదో వినుము. భార్యలను సురతవేళఁ బ్రోత్సహించి వశపఱుచుకొనునప్పుడును, వివాహము కుదుర్చుటయందును, బరిహాసమందును, వత్తిఁ బ్రాణమునకు వినాశము సంభవించు నెడలను, గోబ్రాహ్మణ రక్షణమందును, హింస నివారించునప్పుడును బొంకుట నింద్యము గాదు. దైత్యేంద్రా! యిప్పుడు నీవు సత్యమందే నిలిచెదవేని నీకుఁ గల సర్వస్వము గోలుపోవుదువు. దానజీవనహాని ఘటిల్లు. ముల్లోకము లేలు ప్రభువవు. చేతఁ గాసైన లేక యెట్లు జీవించెదవు? కలవాఁడే భార్యగలవాఁడు బిడ్డలఁ గలవాఁడు

చుట్టపక్కములు గలవాఁడు. పరివారము గల వాఁడు కలవానికి నీడుజోడు గలదా. లేని వాఁడు భూమిపైనుండియు లేనివాఁడే. జనులందఱు ధనదాసులు. నీ ధనమునకై నిన్నిందఱు పరివేష్టించి భృత్యాను భృత్యులై చేతులు కట్టుకొని కొలుచుచున్నారు. గాని నీ సత్యత్వమునకు మెచ్చిగాదు. సూర్యుని వెంటఁ గిరణములు పోయినట్టు ధనముతోడ వీరందఱు మాయమగుదురు. ధనమే ప్రాణము. ధనము లేనివాఁడు ప్రాణము లేనివాఁడు సమానులు. సత్యమును జేపట్టి లక్ష్మిని జేవిడకుము. మూఁడవయడుగున కెడము లేమి నీ కసత్యదోషము మెట్లును దప్పదు. రెంటింకిని జెడిన రేవణయేలయ్యెదవు?

అంతియుగాదు, నిన్ను వంచించి పుచ్చుకొని స్వర్గము నింద్రున కియ్యదలఁచిన మాయలాఁ డితఁడు. వంచకులను వంచించుటయు దోషము గాదు. కావున మూఁడడుగుల మేరనేల యీయక యేదియో నీకుఁ దోచినంత యిచ్చి పుచ్చుము.

అనిన బలి యించుక సేపాలోచించి యిట్లనియె.

ఆచార్యవర్యా! మీరు సెలవిచ్చినదంతయుఁ దథ్యము పథ్యము. అదిథ్యగృహస్థులకు ధర్మము నేనును గృహస్థుఁడనే. అయినను బ్రాహ్మణునకిచ్చె దనని యాశచెప్పి ధనలోభముచేఁ బ్రహ్లాదు మనుమఁడు దుష్టకితవుని వలె నిప్పు డెట్లు లేదు పొమ్మని యాశాభంగము గావింపఁగలఁడు. పలికి బొంకుటకంటెఁ బాపము గలదా? మేరువింధ్య పర్వతముల నెన్నియైన మోవఁగలను గాని యసత్యము లాడు వంచకుని మోయఁజాలనని భూదేవి బ్రహ్మతోఁ జెప్పలేదా? నరకమునకు బయపడను. దారిద్ర్యమునకు భీతిల్లను. దుఃఖసముద్రమునకు వెఱవను. స్థానభ్రష్టతకు జడియను. మరణమునకు జంకనుగాని కల్లలాడి బ్రాహ్మణుని మోసగించుటకు మాత్రము వెఱతును. అయ్యా! ధనము సర్వకాలము మనల నంటియుండునది గాదు. తనంతటఁ దానే పోయినఁ బోవును. లేదా మనము మరణించినను బోవును. తానై తొలఁగిన దుఃఖహేతువగును. మనమై యిచ్చిన సుకృతహేతువు సుఖహేతువు నగు. ఆపత్కాలమున మనల ధనము రక్షించును గావున సర్వస్వమిచ్చుట పాడిగాదదందురేని యాపద యనుభవింపవలసియే యుండిన యెడల సంచితార్థము గూడ నశించును గదా. అంతియకాదు. అడిగినదంతయు





నెఇచ్చెదనని బాస చేసి యాస కల్పించి పిదప బొంకి కొంచెమిచ్చినచో యాచఁకు డసంతుష్టుఁడగును గదా. ఆశాభంగము గావించుటచే నట్టి దానము చేసియు వ్యర్థము.

ఇయ్యిరాని ప్రాణములనే యిచ్చి శిబి దధీచిలోనగు సాధువులు పరులకు శ్రేయస్సు గలిగించియుండ నేల యిట్టి యిచ్చుటకా నేను జంకవలయును ? వెనుకంజ పెట్టని వీరులైన దైత్యేశ్వరుల భోగమును గాలము మ్రింగఁ గలిగెను గాని వారి కీర్తిని మ్రింగఁ గలిగెనా? ధనమునకై తనువు లిచ్చిన వారి పేర్లు లెక్కకు మిక్కుటంబుగ వినుచున్నారము గాని సత్పాత్రమునకు ధనము లిచ్చినవారి నట్లు వినుచున్నారమా? సామాన్యులైన యర్థులకు ధనమిచ్చుటచేఁ గలుగు పేదఱికము వివేకియు దయావంతుఁడునగు వానికి శ్రేయస్కరమే. అట్లుండ మీవంటి బ్రహ్మవేత్తలకు నిచ్చి పేదవడిన లోటేమి. కావున నీ చిన్న బ్రాహ్మణ కుమారునకు మాట తప్పక యిచ్చుటే నాకుఁ గల్యాణము.

వివాహాదులం దసత్యమాడ వచ్చుననుట యనుమతియేగాని యాజ్ఞ గాదు. అసత్యమాడి వివాహాదులు నిర్వహించుట శ్రేయస్కరమో సత్యమాడి నిర్వహించుట శ్రేయస్కరమో మీరే చెప్పుఁడు. ఇతఁడు బ్రాహ్మణకుమారుఁడు గాఁడు. సాక్షాచ్ఛ్రీ మహావిష్ణువని యంటిరి. పరమసంతోషము. “అభ్యాగతస్స్వయం విష్ణుః” అభ్యాగతుని సాక్షాద్విష్ణువుగ నర్చింపుమని మీరే కదా యుపదేశించితిరి. అట్లుండ నిప్పుడు శ్రీమహావిష్ణువే యభ్యాగతుఁడై వచ్చినపుడు నిరాకరించుట మీ శిష్యుఁడనైన నాకుఁదగునా? దాతకుఁ బాత్రము దుర్లభము. పాత్రము లభించినపుడు తొలఁగఁ ద్రోచికొను దాతకంటె నిర్భాగ్యుఁ డెవఁడు? ఇట్టి దానపాత్రుఁడు నాకెన్నఁడు లభింపఁ నగలఁడు? మీవంటి వేదకోవిదు లెవ్వనిఁ గూర్చి యజ్ఞములు చేయుదురో యట్టి విష్ణువు యజ్ఞకాలముల వచ్చి దేహియన నాస్తి యనిన నీ యజ్ఞముచే నెవఁడు తృప్తుఁ డగును? అంతియకాదు.

శా. **ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయం**
**బుపైఁ । బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిం**
**డ్లపై నూత్నమ ర్యాదంజెందు కరంబు క్రిం**
**దగుట, మీఁదై నా కరంబుంట, మేల్గాదే? రా**
**జ్యము గీజ్యమున్ సతతమే? కాయంబు నాపా**
**యమే?**

**మ. నిరయంబైన నిబద్ధమైన ధరణిన్ నిర్మూలనంబైన దు**
**ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము**
**కానిమ్ముపో । హరియైనన్ హరుఁడైన నీరజభవుం**
**డభ్యాగతుం డైన నౌఁ । దిరుగన్ నేరదు నాదు**
**జిహ్వ వినుమీధీవర్య ! వేయేటికిన్.**

కల్యాణ నిదానంబు దానంబుఁ గొని వెన్నుండు నన్నుఁ గట్టి వేయునంటిరి. ఉపకారి కపకారమును నాత్మయశోహానికరమైన కార్యమాయన యేల చేయును? ఒకవేళఁ గట్టెనా యాయనయే కరుణించి విడుచును. విడువకుండెనా యుండనిమ్ము. దానివలన నాకేమి నష్టి. నన్ను వంచించి సిరి గ్రహించి శచీ భర్తకిచ్చునంటిరి. కామ్యములందు దానము దుర్వినియోగపడకుండునట్లు పాత్ర మెఱుఁగ వలయును. ప్రతిఫలాపేక్షచే నరులకు దానము చేయు నపుడట్టి యాలోచనలు తగునగాని భక్తిచే భగత్ప్రీతిగ నేను దానము చేసినపు డాయన మరల నెవ్వరికిచ్చిన నాకేమి? ఏమి చేసిన నేమి? లక్ష్మీకాంతుఁడు సంతసించిన నా కంతియచాలును. ఏది యెట్లుండినను నీ చిన్నిబాలుఁడు ముద్దు మాటలఁ జిన్ని చేతులొగ్గి యాచింపఁ గాలేదనుటకు నా మనస్సొల్లకున్నది.

అనిన శుక్రుండు కోపంబున వక్రదృష్టిని సత్యసంధుఁడు ధీరుఁడునగు శిష్యుం జూచుచు నోరకీ గురువాక్యం బుల్లంఘించితివి గావున వైళంబ పదభ్రష్టుఁడవు కమ్మని శపించె. అట్లు నిష్కారణంబుగ శపింపఁ బడియు బలి ధైర్యంబు పాయకుండె.

కట్టుపడినను గొట్టువడినను దిట్టు వడినను రట్టు పడినను బ్రాణము పోయినను బేదఱికము వచ్చినను మానవంతులు మాటతప్పరు.

అంతజాలక జాల భూషితయైన యతని సతి వింధ్యావళి బ్రహ్మచారి పాదములు ప్రక్షాళింప బంగారు కమండలువున జలంబు గొని వచ్చిన నమ్మాయావటువుంగని బలి బాలకోత్తమా! నీ పాదంబు లిటులిమ్ము. కడఁ గెదనని యాయన కుడిపాదము పట్టుకొనియె. వింధ్యావళియుఁ గలశంబున నీరుపోయఁ దొడఁగెను గాని పాత్రము తొండము నుండి ధారపడదయ్యె. దైత్యలక్ష్మివల్లికి నసిధార యగు నాధారపడకుండ శుక్రుండు తన యోగబలంబునఁ బాత్రమునందుఁ జొచ్చి రంధ్రమున కడ్డుపడియె.





జగద్రక్షామనుండైన వామనుం డదియెఱిఁగి పుల్లతోఁ బొడిచిన శుక్రునకొక కన్ను నష్టమయ్యె. ధర్మహాని గావింపఁ గలుగు ఫలము వెంటనె యనుభవించి యందుండ వెఱచి శుక్రండు తొలఁగిపోయె. అంత బలియుఁ దన దారపోయు జలధారచే భక్తి రక్షాకరణంబులైన హరిచరణంబులఁ గడఁగి తనమీఁది యుత్తరీయంబునఁ దడియొత్తి యా జలంబు తనపైఁ జల్లుకొని భార్య శిరస్సునను బ్రోక్షించి హరి స్వరూపుండయిన విప్రునకు మూఁడడుగుల భూమి దానమిచ్చితినని చెప్పుచు జలంబు వామను హస్తంబున విడిచె. తన యుద్దేశంబును, శుక్రు శాపంబును, రాఁగల చేటు నెఱిఁగి యెఱిఁగి పలికి బొంక వెఱచి బలి యిచ్చిన యీవికి హరి సంతసించె. సర్వభూతమయుండు హరి సంతసించినంతన దశదిశల భూతజాతంబులు సంతోషాతిరేకంబున భళిభళీ మేలుమేలని ప్రశంసించె. అంత నస్సరః కాంతలు నితాంతప్రమోదంబున నంతరిక్షంబున నర్తించిరి. గంధర్వులు గీతంబులఁ గీర్తించిరి. దేవత లానందంబున గీర్తించిరి. దేవత లానందంబున వర్తించిరి.

ఇట్లు విబుధకల్యాణ నిదానంబయిన దానంబుగొని భక్తుల పాలి పెన్నిధానంబు హరి ఇంతగనున్న వాఁడింతై మఱియింతై దానిపైనంతై యల్లదానికంతై సూర్యమండలముపై నంతై చంద్రమండలము దాఁకి దానిపై నంతై చంద్రమండలము దాఁకి దానిపైనంతై చంద్రమండలము దాఁకి దానిపైనంతై ధ్రువునిపైనంతై మహర్లోకముదాఁటి సత్యలోకముపై నంతకంతై దేహంబుచే లోకమంతయు నాక్రమించె. ఇట్లు పెరుఁగు చుండు నా త్రివిక్రమమూర్తికిఁ దొలుత సూర్యుఁడు సువర్ణచ్ఛత్రంబై కానవచ్చెఁగాని పెరుఁగు కొలఁది చూడామణియై కుండలమణియై హారమును పతకమై కంకణమణియై మేఖలామణియై నూపురమణియైన కనక పీఠమై యుపమింపఁ దగియుండె. ఇట్లు విశ్వరూపంబు ధరించి భూమి యాకాశము నంతరాళము దశదిశలు రంధ్రంబులు నీ రంధ్రంబుగ నిండి శంఖచక్రశార్ఙ్గాది సాధనంబులు కిరీటహార కేయూరాద్యాభరణంబులు ధరించి సునందనంద జయవిజయ ప్రముఖ పరిచరులు సేవింప బ్రహ్మాండకటాహంబు భేదించి విజృంభించె. బ్రహ్మాదిదేవతలు తక్కినవా రా మూర్తియందుఁ దమతమ స్థానంబుల నెలకొనిరి. సమస్త ప్రపంచంబామూర్తి యంద కానవచ్చె.

ఇవ్విధి సర్వజగం బాక్రమించిన యాత్రి విక్రముంగని యవక్ర పరాక్ర మధురంధరులైన విప్రచిత్తి ప్రముఖాసురులు సత్యసంధుఁ డైన మన రాజును వంచించి యీ కపట బాలుండు ముల్లోకంబు లాక్రమించె. ఇతని యుసురు మాఁపుదమని కసిమసఁగి యుద్ధ సన్నద్ధులైన యా యప్రబుద్ధులఁ గని బలి నివారించి యిట్లనియె.

రాక్షసోత్తములారా! యిది రణసమయము గాదు. కాలము మన కనుకూలముగ లేదు. దైవవిపర్యయంబునఁ గాలంబు ప్రతికూలించి యున్నది. హానివృద్ధులు కాలవశములు. కావున విక్రమంబునుండి విరమింపుఁడనిన వారూరక ఛీ యిక్కడ నింక మనకేమి పనియని తొలఁగిపోయిరి. సర్వస్వ దానంబున మమతలేనివాఁడయ్యె. అహంకారమైనఁ గలదో లేదో యని పరీక్షించి యత్యుత్తమ శ్రేయస్సుఁ గూర్పనెంచిన హరి హృదయం బెఱింగి తార్క్ష్యనందనుండు బలిని వారుణపాశంబులఁ బంధించె. ఇట్లు బంధించినను బలియు ఖన్నుండుగాక యివి సంసారశాపంబులకంటె ఘోరంబులు గావు. అక్కట్టులనుండి తొలఁగించుటకే కాఁబోలు భగవంతుఁడ నన్నిక్కట్ల నిక్కట్లఁ బెట్టఁ జూచెడి కానిమ్మని ధీరుఁడై యించుకయుఁ జలింపకయుండెన.

అంతఁ ద్రివిక్రమదేవుండు సురవిద్వేషణు మేఘగంభీర భాషణంబుల నిట్లనియెను. దైత్యకులభూషణా! నీవు నాకు మూఁడడుగుల నేల యిచ్చెదనంటివి. భూమియంతయు నొకయడుగునకు నాకాశంబంతయు నొకయడుగనకు సరిపోయె ఇఁక మూఁడవ యడుగనకు స్థలముఁ జూపుము. చూపవేని యసత్యదోషంబున నరకంబునకుఁ బొమ్మనిన నరాతిజనభీషణుండు బలిసాధుజన తోషణంబులయిన భాషణంబుల నిట్లనియె.

**ఆ. సూనృతంబకాని సుడియదు నా జిహ్వ,**
**బొంకఁజాల నాకు బొంకు లేదు**
**నీ తృతీయపదము నిజము నాశిరమున**
**నెలవుచేసిపెట్టు నిర్మలాత్మ.**

**ఆ. నిరయమునకుఁ బ్రాప్త నిగ్రహంబునకును**
**బదవిహీనతకును బంధనమున**
**కర్థభంగమునకు నఖిలదుఃఖమునకు**
**వెఱవ దేవ బొంక వెఱచినట్లు.**





జననీజనకులు సోదరులు మిత్రులు గురువులు దండించుట యనుగ్రహ బుద్ధిచేతనే కాని నిగ్రహ బుద్ధిఁ గాదు. ఐశ్వర్యమదాంధుఁడనైన నాకు నేత్రదోషంబు వాపి ఋజు మార్గంబు గానవచ్చునట్లు చేయుటం జేసి నీవే మాకుఁ బరమ గురువవు. ని న్ననుసరించి వర్తించు పరమయోగులకు నిచ్చు పదవినే నిన్ను రణమున నొప్పించిన మాపూర్వులకు నిచ్చితివి. నీవు దేవతలకును దానవులకును సమానదైవమవు. నీ వనుగ్రహించినఁ గలుగు ఫలమే నిగ్రహించినను గలుగు. కావున నీ నిగ్రహానుగ్రహంబులు పర్యాయపదంబులు. ఈ కారణంబుల నీవు నన్నుఁ గట్టినను గొట్టినను నాకు సిగ్గుగాని యెగ్గుగాని లేదు దేవా!

**మ. చెలియే మృత్యువు? చుట్టమే యముఁడు? సంసేవా**
**ర్థులే కింకరుల్? శిలలంజేసెనె బ్రహ్మదన్ను? దృఢ**
**మే జీవంబు? నోచెల్లరే! చలితంబౌట యెఱుంగ**
**కీకపట సంసారంబు నిక్కంబుగాఁ దలఁచుఁ**
**మూఢుఁడు సత్యదానకరుణా ధర్మాదినిర్ముక్తుఁడై.**

చుట్టాలందమా దొంగలు, కొడుకులా యప్పులవారు, భార్యలా సంసార బంధకారణములు, ధనములా సముద్రపుటలలు, దేహమా మెఱుపుఁదీఁగె, యర్థులా కార్యార్థులు, కాలమా మహాప్రవాహము, ఆయువా క్షణికము, కావునఁ గదా తన తండ్రిని ధిక్కరించి నిన్ను సేవించి మా తాత ప్రహ్లాదుఁడు చావులేని బ్రతుకునార్జించె. లోకములో నందఱు భుక్తికో ముక్తికో నిన్ను యాచించుచుండ నీవు నన్ను యాచించుట నా మహాపుణ్యోదయమునఁ గదా. అనునెడఁ బ్రహ్లాదుండు సమీపించినఁ బాశబద్ధుండు గావున బలి శిరంబు వ్రాల్చి నమస్కరించె. ప్రహ్లాదుండును సునందాది పరిచర సమేతుండై ముఖ మంటపమునఁ గూర్చున్న వామనమూర్తింగని సాష్టాంగ దండ ప్రణామం బాచరించి యిట్లు విన్నవించె.

మున్ను నీ వితనికి నింద్రపదం బిచ్చుట కంటె నిప్పుడు దానిఁ దొలఁగించి మిక్కిలి శ్రేయస్సు గూర్చితివి. ఐశ్వర్యము మోహాహంకార మూలంబు. గర్వాంధ్యకారణంబు. దేవా! సంపత్తుగలవానికిఁ గన్నులు గానరావు. చెవులు వినరావు. స్థిరచిత్తము లేదు. కావునఁ దత్త్వజ్ఞునకు నింద్రపదవి యేల? శతకోటి యంద్రపదవులయినను నీ పదభజననుసుఖంబునకు లేశమైన సరిరావు.

కావున దానిఁ దొలఁగించి శుభంబుఁ గూర్చితివి. అనుచున్న సమయంబునఁ బైఁట చక్క బిగించి కరకమలంబులు శిరంబునఁ జేర్చి కన్నీరు కాఱుచుండ భయంబున వణఁకుచు మత్తమరాళయానంబున సంధ్యావళి శ్రియఃపతే పతిభిక్షాం మమదేహి యనుచుఁ జేరవచ్చి యిట్లనియె.

స్వక్రీడార్థమై నీవు కల్పించి నీవ యాడించు లోకంబులలో నేదో యొక యీ లోకంబున నేదో మూలలో వేయింట నొకపాలు నేలకు నేలికలై కొందఱు వరాకులు జీవులు తామే జగదీశ్వరులమని మిన్ను మన్ను కన్ను గానక చరింతురు దేవా? మహానుభావా! నీవు చెప్పినది కాదనెనా? అడిగినది లేదనెనా? ఇచ్చెదనని తప్పెనా? నీ విట్టివాఁడనని యిట్టు చేసెదవని తెలిసియు మూఁడు లోకముల రాజ్యము నీకే సమర్పించెఁ గదా. నా ప్రాణేశ్వరు నేల కట్టితివి? ఉపకార ఫలమా యిది? అనుచుండ బ్రహ్మ యరుదెంచి నానవిధంబుల స్తుతించి పరమేశ్వరా! నీ యుద్యమంబు, తనకు రాగఁగల చేటు నెఱిఁగి యెఱిఁగి నీవు సంతోషింప దానంబు చేసిన వానిపై రోషించి యిట్లు కట్టనగునా? వీని ననుగ్రహింపుమనిన వామన దేవుం డిట్లనియె.

ఎవ్వని నే ననుగ్రహింపఁ గోరుదునో వాని సర్వస్వము నే నపహరింతును. దానఁ జేసి వాఁడు వయోరూపబలధన విద్యాగర్వం బుడిగి నన్నేకచిత్తంబున సేవించి సంసారంబుఁ దరించు. అటుగాక సంసారమత్తుఁడు చంచలచిత్తుఁడక్ష్మ జనన మరణ చక్రంబునఁ దగులుకొని చచ్చుచుఁ బుట్టుచుఁ బుట్టుచుఁ జచ్చుచుఁ దరిగాన లేక తపించుచుండు. ఇతఁడు గురుశాపపీడితుఁడైనను బంధువులెల్లఁ దొలఁగిపోయినను బద్ధుఁడై నను, సిరి చెడినను, బేదవడినను, మనోనిర్మలత్వమును, సత్యమును, గరుణయు ముఖవికాసము తప్పినవాఁడు కాఁడు. అహంకార మమకారములు దూరంబును జేసి జయింపరాని నా మాయను గెలిచెను. ఇతఁ డసురుఁడు కదా. ఇతని మర్యాద చూతమని యింత చేసినను నితఁడు సత్యమందే నిలిచెను. కావున సావర్ణి మనువు వేళ నితనికి నింద్రపద మిచ్చెదను. ఆవల నా యొద్దకు రప్పించుకొనెదను. అంతదాఁక సుతలంబున నితఁడుండుఁగాక. అందు వ్యాధులు నాధులు బాధలు పీడలు నేమియు లేక సర్వసుఖయుక్తంబై యుండు అని భగవంతుడు బలింగని యిట్లనియె.





"ఇంద్రసేనమహారాజా! నీవు బంధుయుతుండవై సుతంబున కరుగుము. అందు వసింప దేవతలును నభిలషించుచుందురు. అచ్చట నుండు నిన్ను లకేశులైనను బరిభవింపఁజాలరనఁ దక్కిన వారి మాట యేల! నీ యాజ్ఞాతిలంఘనము గావించిన దైత్యుల నెల్ల నా చక్రంబు సంహరించుచుండు. అందు నీ ద్వారరక్షకుఁడనై నేను గాచి నీకు గోచరించుచుండెద. దైత్యదాననయుక్తుండవైనను నా మహిమచే నీ యసురభావంబు నశించు అనిన బలి యిట్లనియె.

దేవాదిదేవా మహానుభావా!పరమకారుణికా! భక్తార్తశరణ్యా దేవలయందును నీవు కనఁబఱుపని దయ నే!డు నాయందుఁ గనఁబఱిచి నా బ్రతుకుపాటు తెలిపి గొప్పవానిఁగఁ జేసితివి. నీ దయకుఁ బాత్రుఁడనగుట చేతనే నేను గృతార్థుఁడనైతి నని చెప్పి పరమేష్ఠి ప్రముఖుల యాజ్ఞగొని ప్రహ్లాద దారపుత్రామాత్యబంధువులతోడ బలి రసాతలంబున కరిగె. వామను నాజ్ఞ శుక్రుండు యజ్ఞశేషంబు సాగించె. వామనుండు సర్వదేవతానీతుండై స్వర్గంబున కరిగె. అం దింద్రుని స్థాపించె.

కం. **పాలడుగఁడు మేలడుగం**
**దేలఁడు భిక్షించి యన్నకిచ్చెఁ ద్రిజగముఁ**
**వేలుపుల తల్లి కడపటి**
**చూలుం బోలంగఁ గలరె సొలయని తమ్ముల్.**

రుక్మిణి : అప్పా! యవతారము లెన్ని?

తండ్రి : ముఖ్యావతారములు పది. మత్స్యావతారము – కూర్మావతారము – వరాహావతారము – నరసింహావతారము – వామనావతారము – పరశురామావతారము – శ్రీరామావతారము – కృష్ణావతారము – బుద్ధావతారము – కల్క్యవతారము. అవతారము లిరువది యొకటియని శ్రీభాగవతంబునఁ గలదు. ఆ సంఖ్య యందుఁ గొన్ని యంశావతారములు చేరుచున్నవి.

రుక్మిణి : అంశావతారములన నేమి?

తండ్రి : ఉ. **సర్వఫలప్రదాతయును సర్వశరణ్యుఁడు సర్వశక్తుఁడుఁ**
**సర్వజగత్ప్రసిద్ధుఁడును సర్వగతుండగు చక్రపాణి యా**

